ద్దిలో వ్యావహారిక భాషలో తెలుగు పత్రికలు, గ్రంథాలు, కావ్యాలు, ఉపన్యాసాలూ, అసంఖ్యాకంగా వెలువడం మూలాన మనకు కొంతకు కొంతైనా మన నానుడ్లు — పలుకుబడ్లు మాండలికాలు — సామెతలు నేటి మనవాఙ్మయంలో భద్రపడి ఉన్నాయి. తెలుగులో వ్యావహారిక భాషే గ్రాంథిక భాష అయిన యీ సమయాన, ప్రామాణికత్వం అంటూ వ్యావహారిక భాష కేర్పడవలసిన యీ తరుణంలో మన నానుడ్లు పలుకుబడ్లు, సామెతలు, మాండలికాలు క్రోడీకరించి నిఘంటువులుగా రూపొందించడానికి ప్రయత్నాలు ఒక దిశ జరుగుతూ ఉండడం మనము హర్షింపదగిన విశేషం. ఈ వ్యాసం అలాంటి ప్రయత్నాలకి ఏ కొలదిగానో దోహదం కాగలదనే విశ్వాసం!

ఏ భాషలో ఉన్న నానుడ్లు — పలుకుబడ్లు ఆ భాష మాట్లాడేవాళ్ల శీలాన్ని, ఆచార వ్యవహారాలను జీవితాన్ని ప్రతిబింబించ కలిగినవి అవుతాయి అనడం సత్యం. అలంకారాలపైన ప్రీతీ, ముక్కుమీద కోపమూ, పరులను పరిహసించే స్వభావం, అల్పసంతోష ప్రవృత్తితో, వ్యవసాయిక జీవిత సౌభాగ్యమూ, ప్రకృతిసౌందర్యపరవశత్వమూ, పైకి పాషాణసదృశత్వ కాఠిన్యమూ, హృదయంలో ఆర్ద్రతా పూర్వమైన ప్రేమా, పాపభీతీ, దైవభక్తీ ఉద్రేకమూ జాత్యభిమానము, కళాప్రియత్వమూ మున్నగునవి తెలుగువారి గుణశీలాలన్నిటినీ తెలియజెప్పేవి యీ మన నానుడ్లు — పలుకుబడ్లూను.

ఇంక మన నానుడ్లను — పలుకుబడ్లను కొన్నింటిని వివిధ శీర్షికల క్రింద విభజించి యీదిగువ నుదాహరిస్తున్నాను.

## జంట పదాలు :

ఇవి నానువాచకాలకు చెందినవి. వీటిల్లో ప్రాసలూ, ఆద్యంతాక్షరనియమాలూ, సాదృశ్యమూ ఎంత చక్కగా అమరివుంటాయో గుర్తించండి. ఈ జంట పదాలలో కొన్ని పదాలకు అర్థం విచారించవలసి ఉంటున్నది. ఎక్కడో కొన్ని ఒకే అర్థాన్ని తెలిపే పదాలై రెండూ ఉంటున్నవి; యతిప్రాసల అందమే అందం!

పెళ్ళీ పేరంటమూ
నాకర్లూ చాకర్లూ
ఊరూ పేరూ
కొంపా గోడూ
డాబులు డబ్బీలు
చెట్టూ పుట్టా
పిల్లా పీచూ
పరువూ ప్రతిష్ఠా
మన్నూ దుమ్మూ
చెట్టూ చేమా
నీతీ జాతీ
సందూ గొందూ
ఈడూ జోడూ
కొయ్యా గొంతిమా
ఆకూ అలమూ
ఆలనా పాలనా
గాలీ ధూళీ
ఆతీ గతీ
నా నో! వంగడో!
కుద్దం బద్దం
పూలూ పుక్కాయి
కలో గంజో
కాలం కర్మం
వావీ వరుసా
జయాన భయాన
బండీ బస్తిమూ
అనువూ అజ్జా
గుడ్డా పాతా
ఆగం అల్లరి
దుమ్ము దుమారం
దగ్గర ? దాపా ?
చీకూ చింతా
నుయ్యో గొయ్యో
జీతం నాతం
డబ్బూ దస్కమూ
అభము శుభము
మంచీ చెడ్డా
మాటా ముల్లే
పాడీ పంటా
తలా తోకా
బీదా బిక్కీ
ఇరుగూ పొరుగూ
బూడిదా బుగ్గి
కూలీ నాలీ
ఎదుగూ బొదుగూ
ముసలీ ముతకా
నగలూ నాణ్యాలు
ముద్దూ మురిపెమూ
మడీ మైలా
తీర్థం పార్థం
మందూ మాకూ
పీలూ చాలూ
తేళ్లూ జెంకర్లూ
విధీ విరామమూ
అంటూ పొంటూ
వదరూ బెదరూ
పొలమూ బుట్రా
రుచీ పచీ
భాగ్యమో! బంగారమో
సిగూ ఎగూ
చదువూ సంధ్యా
దిక్కూ దివాణం
దారీ డొంకా
అదీ ఇదీ
మాటా మర్యాదా
భయమూ భక్తీ
కూడూ గుడ్డా
తిండీ తిప్పలు
చెత్తా చెదారం
అంటూ సొంటూ
మడీ మాన్యం
చాటూ మాటూ
చెక్కా డొక్కా
గొడ్డూ గోదా
అన్నెము పున్నెము
బాగూ ఓగూ
పిల్లా జెల్లా
ఇల్లూ వాకిలి
రేవో మాపో
పుణ్యమూ పురుషార్థమూ
సొమ్ము సంబంధమూ
చీరెలూ సారెలూ
గట్టూ గనుమూ
మాటా మంతీ

| | |
|---|---|
| తాడూ బొంగరమూ | చిన్నదా? చితుకదా? |
| హూరా హారా | నీళ్లా నిప్పులా |
| గడ్డీ గాదం | పోరూ పొక్కూ |
| చేటూ పాటూ | చాటూ మాటూ |
| వంటా వార్పూ | దిక్కూ మొక్కూ |
| సాయిలా బాయిలా | పురుగూ పుట్రా |
| ఆలూ చూలూ | ఊరూ వాడూ |
| మన్నూ మశానం | ఆస్తీ పాస్తీ |
| అగ్గీ బుగ్గీ | మడీ దడీ |
| గుట్టూ మట్టూ | చెట్టూ పుట్టా |
| దేవుడూ దయ్యమూ | కలవో కాలమో |
| బేరం సారం | తీరూ తీయమూ |
| వన్నే చిన్నే | పండూ ఫలమూ |

కథా కమామీషు — మొదలైనవి.

## వ్యస్త, సమస్త పదాలు :

వ్యస్తంగా కొన్ని, సమస్తంగా కొన్ని పదాలు విశేషణాలతో అలంకారాలతో కూడినవి కన్పిస్తున్నాయి. కేవలం సూటిగా ఒక అర్థం చెప్పేవి కాక వీటిలో కొన్ని భావాన్నీ, శీలాన్నీ, తెలియచెప్పేవిగాను ఉంటున్నాయి. వ్యస్తంగాను సమస్తంగాను వాని సొగసులను విశిష్టార్థాలను పరిశీలించవలసి ఉంది: కొన్ని అవ్యయాలనుకూడా చూడవచ్చు:

| | |
|---|---|
| ఆకతాయి | తిప్పకాయ |
| తింగరంగా అని | నా సామిరంగా అని |
| పసేమిరా | తెలుదువమ్మ అని |
| కలుగ్గురాయుడు | ఉట్టుడియంగా |
| అకపటోకసగా | మాగిముకానమ్మ |
| కావరాని చీరి | పరాచికం |
| ఉత్తి అర్భకుడు | వెర్రివెంగళప్ప |
| వెకిలి వేషాలు | ఇచ్చకాలు |
| శవభిమలు | మనసులోమాట |
| కలికాలిత్తైజా | ఉప్పులో తొమ్మిది |
| దూరాభారం | తామరతంపర |
| తినదసేమో, తా సేమో | పోచాయింపులు |
| దూచాయగా | బట్టబయలు |
| బ్రతుకుజీవుడా అని | రాకంధాళి |
| ఉత్తిపుణ్యాని! | ఉక్కిరిబిక్కిరి |
| బులిబుచ్చికాలు | మిడిమేలం |
| బిక్కు ఫకీరు | కల్లబొల్లికబుర్లు |
| అపసోపాలు | బొడ్డూడనివాడు |
| తాయిలం | సంగసాచి |
| ఆరిందా | గోచీపాతరాయుడు |
| ఒట్టిబరువు | ఉన్నపళంగా |
| కట్టుకట్టుకొని | లావాదేవీలు |
| కాలికి బలపం కట్టుకొని | తలవిరపవకాయ |
| విచ్చలవిడిగా | అదేపనిగా |
| చినమెత్తు | గడుగాయి |
| గుండెమీద చేయి వేసికొని | పొట్టవాయకట్టుకుని |
| చెవులు దోరపెట్టుకొని | చీమ చిటుక్కుమంటే |
| అదమరచి | ఒళ్లు తెలియక |
| చెప్పులలో కాళ్లుపెట్టుకొని | వేలంవెర్రి |
| పోచికోలుకబుర్లు | వ్రాతకోతలు |
| తిండోపతిండాలు | అంతరపాంతరవాళ్లు |
| బ్రతుకుబండారం | కన్నులపండువు |
| వెన్నెల విసనకర్ర | పాపాయి పరుపదాయి |

సైలా పచ్చీస.

## అలంకారిక పదాలు :

ఉపమ, రూపకాద్యలంకారాలను ప్రోదిగొన్న పదాలు కొన్ని ముద్పుట గొల్పుతూ అనుపిస్తున్నాయి:

| | |
|---|---|
| కుక్కగొడుగులలాగా | తలకొట్టి వేసినట్లు |
| కొంగుబంగారం | అరవచాకిరి |
| గాడిదబరువు | కోతియూకలాగ |
| కాకిగోల | నక్కవినయాలు |
| అవగింజంత | కీతకన్ను |
| ఏనుగుపాడి | మాసివాయనం ముత్తైదులాగా |
| కుళ్లుకుమ్మడికాయ | గుడ్డెద్దు చేలో బడినట్లు |
| ఎంగిలిమంగలం | కాలుకాలిన పిల్లిలాగా |
| అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లు | కట్టెవిరిచినట్లు |
| అట్టుడికినట్లు | పొట్టచెక్కలయ్యేటట్లు |
| కుండపగలకొట్టినట్లు | చెప్పుకింద తేలులాగా |
| కుక్కిన పేనులాగా | పూలలో దారములాగా |
| మొహంవాచేటట్లు చివాట్లు | పొట్టిబుఱంకాయ |
| ఏడ్చి మొత్తుకున్నట్లు | పిండి ఆరబోసినట్లు |
| మిన్నువిరిగి మీదపడ్డట్లు | చెంపకుచేరడేసి కళ్లు |
| కాటుకకళ్లు | బెల్లంకొట్టిన రాయిలాగా |

పానక్రింద వెన్నెలలాగా — మొదలైనవి.

## ధ్వన్యనుకరణాలు :

### ఆంగికవస్తు విశేష సూచకాలు

వస్తువిశేషాలను, ఆంగికారాలను సూచించే టప్పుడుగాని, ధ్వనిని అనుకరించే సమయానగాని ప్రత్యేకంగా ఆపదాలనే మనం వాడవలసి ఉంది. వేరే పదాలను వాడితే మనకారము తెలియనివాళ్లమే అవుతాము: ఆయా క్రియాపదాలను ప్రయోగాలను చూడండి:

| | |
|---|---|
| గజగజవణకడం | రెపరెపలాడడం |
| (గుండె) ఝల్లుమనడం | (ప్రాణాలు) నకనకలాడడం |
| (ఆకులు) విలవిలరాలడం | (చేతులుకాళ్లు) విల విల కొట్టుకోడం |
| చెంగుచెంగున ఎగరడం | మలమల మాడడం |
| కిలకిల నవ్వడం | గబగబ నడవడం |
| (గుండె) దడదడ లాడడం | (గంట) ఖంగుమని మ్రోగడం |
| గిలగిల తన్నుకోవడం | కుతకుత ఉడకడం |
| ఘల్లు ఘల్లున గజ్జలు | కణకణలాడే నిప్పులు |
| జోరున వర్షం | హోరుమని గాలి |
| రణగొణ ధ్వని | ముసిముసి నవ్వులు |
| చిర్రుబుర్రు మనడం | దడామడా తిట్టడం |
| చివాలున లేవడం | భోరుమని ఏడ్వడం |
| ఛావుకుమని ఏడ్వడం | నిటారుగా నిల్వడం |
| దభేలునపడడం | (గుండె) గుభేలుమనడం |
| గుజగుజలుపోవడం | టకటక నడవడం |
| తళతళ మెరవడం | కకపికా చేయించడం |
| చరచర సాగిపోవడం | వలవల ఏడ్వడం |
| బిరబిర నడవడం | (చర్మం) విరవిరలాడిపోవడం |
| ((వేళ్లు) కొంకరు పోవడం | వలిగొనిపోవడం |

మొదలైనవి.

## క్రియాపదాలు :

ప్రత్యేకంగా పరిశీలింపదగినది క్రియాపదాల ప్రయోగంలో ఉన్న వైచిత్రి! ఇవి వక్తభావోద్వేగాన్ని, భావనైశిత్యాన్ని అందలి తీవ్రతమ భేదాల్ని తెలిపేవిగా ఉండి భావాలు కేంద్రాలుగా పెట్టుకొని సంచారం సల్పేవిగా ఉన్నాయి. కొన్ని కొన్ని నామవాచకాలతో క్రియాపదాలు చేరి విశిష్టమయిన అర్థాలను ఇచ్చేవి అవుతున్నాయి. ఈ పలుకుబళ్ళను తిలకించండి :

| | |
|---|---|
| చెవికోసుకోవడం | కంకణం కట్టుకోవడం |
| మాట ఇవ్వడం | పట్టి పల్లార్చడం |
| లెక్క కట్టడం | మెతుకు గతకడం |
| వేషాలు వేయడం | పందెం కొడడం |
| పాకిళ్ళు పోవడం | పద్యమల్లడం |
| కవిత్వం చెప్పడం | పూలు ముడవడం |
| పుట్టి మునగడం | దీపం కొండెక్కడం |
| నల్లపూసలు తెగడం | చెవులో గీపెట్టడం |
| ప్రాలాగ్లడం | విభాయించడం |
| మనసులో పాలు త్రాగడం | కళ్ళప్పగించడం |
| నడుము బిగించడం | గుటకలు మ్రింగడం |
| నీళ్ళు నములడం | దప్పరించడం |
| పోరు పెట్టి ఏడ్వడం | చిన్నబుచ్చుకోవడం |
| నోరు తెంచుకొని ఏడవడం | పగలబడి నవ్వడం |
| చంకలు ఎగరవేయడం | లొట్టలు వేయడం |
| పళ్ళికిలించడం | చెవిన పడడం |
| ఇల్లు చక్క బెట్టుకోవడం | కళ్లబడడం |
| చెవులప్పగించడం | తలపట్టిపోవడం |
| చితకగొట్టడం | ఒళ్ళు దాచుకోవడం |
| మరగడం | కాళ్ళు గడ్డాలు పట్టుకోవడం |
| కాళ్లావేళ్లా పడడం | ఒళ్లంతా కళ్ళు చేసుకోవడం |
| మసిలిపోవడం | కళ్ళల్లో నిప్పులుపోసుకోవడం |

కాలుమీద కాలు వేసికొని కూచోడం
తింపటలు పెట్టడం
చాపచంకన పెట్టుకోవడం
తందనాలు త్రొక్కడం
కళ్ళలో వొత్తులు వేసుకోవడం
నోరుపారేసుకోవడం
కాళ్ళీడ్చుకు నడవడం
తలదాచుకోవడం
నూరిపోయడం — మొదలైనవి.

## చీవాట్లు : అధిక్షేపణలు :

తెలుగువారికి ముక్కుమీదకోప మెక్కువ అన్నాను. కాకపోతే "పోడాలుడి"కొట్టితే వచ్చే పొంగులాగా అప్పటికప్పుడే చల్లారిపోతుంది అనుకోండి. ఏమైనా వారి కోపాన్ని నిరూపించే ఈ క్రింది తిట్లు—అధిక్షేపణలు. చూడండి:

| | |
|---|---|
| కళ్లు కన్పించడంలా ? | ఏముఖం పెట్టుకువచ్చావు |
| తీపరమా ? | పట్టపగ్గాలు లేవు |

తేరగా వచ్చిందేం?   ఎక్కడ దాపురించాడు.
నీ మొహం తుమ్మలలో పొద్దుకుంకి నట్టుంది.
కోతులు కొరుకుతూ మొహం చెవులలో దెబ్బ మొలచాయా?
తెలిసి దట్టుబండలైనట్టు   చలిమిడి మొహం
పీడా వదిలింది   జేష్ఠ మొహం
తెలిసి తెల్లవారినట్టుంది   పిల్లికి బిచ్చం పెట్టదు
ఇంత విరగబాటా   ఏం పొయ్యే కాలం
మరీ పోద్దింగా ఉన్నది (చోద్యం)
పనీపాటా లేకపోతే సరి   అఘోరించావులే
పొట్టకోస్తే అక్షరంముక్క లేదు   వాచామాటలు
నీకేం మతిపోయిందా   డొక్క చీల్చిడోలుకట్టడం—

పెందలెవవి సర్వసామాన్యంగా వినిపించేవి—, మానవుల అంతస్తులనుబట్టి వారివారి సంస్కారాలను ఇవి చెప్తూ ఉంటాయి. శిష్టజన వ్యవహారమే ప్రమాణంగా వీనినికూడా ఎంచుకోవలసివచ్చింది.

## పరిశిష్టము

తెలుగుజాతిలో మాగిన సామెతలు కొన్ని సుప్రసిద్ధంగా వ్యవహారములో ఉన్నవి ఉల్లేఖించుటంటేగాని ఈ వ్యాసం శోభాయమానంగా ఉండదని కొన్ని మాత్రం ఇస్తున్నాను ఇందులో నానుళ్ల పలుకుబళ్ళ శ్రేణిలో వచ్చేవి కొన్ని తొంగిచూస్తాంటాయి:

పుట్టుకతో పుట్టింది పుడకలతో గాని పోదు
చెవులలో ఇల్లుకట్టుకొని పోరడం.   ఏటికి ఎదురీతగా
పిండికొద్దీ రొట్టె   తలమునిగి తాటిప్రమాణం
చెంపకు చేరడేసి కళ్లు   మూన్నాళ్ళ పట్టపగలు
అయినవాళ్లకు ఆకులలో కానివాళ్లకు కంచాలలో
ముందువాళ్లకు మొకాళ్లు—వెనకవాళ్లకు వాకిళ్లు
రమ్మన్నారు తమ్మన్నబంతికి
ఆడిందిఆట పాడిందిపాట
గుర్రం గాడిద సమానం   నోట్లో నువ్వుగింజ నానదు
చేతగాని చెన్నయ్య   కుడుం పెడితే పండగ
మాణపట్టుకు వ్రేలాడడం
కాలికేస్తే వేలికి వేలికేస్తే కాలికి
కడుపులో చల్ల కదలకుండా. దేవుడు చాలమేలుచేస్తే
మూడుపూలూ ఆరుకాయలూ. చేతిలో చిల్లిగవ్వ లేదు
కన్నమ్మకే వాపి—తిన్నమ్మకే వాపి
కొనబోతే కొరివి—అమ్మబోతే అడివి.
జన్మకు శివరాత్రి!

పైన ఉదహరించిన నానుళ్లలో పలుకుబళ్లలో ఉన్న అందచందాలను, భాషలోని ఒంపులనూ ఒయ్యారాలనూ, ప్రత్యేకంగా వివరించడానికి అర్థవివేచనకూ పూనుకోలేదు. ఇందుకు గ్రంథ విస్తర భీతియే కారణం. భాషావేత్తలు, విజ్ఞులు, ఇందలి అందచందాలను అభిమానంతో అనుశీలింతురు గాక! మన తెలుగువెలుగుతోపాటు భాషలోని నాదసౌందర్యాన్నీ, జాతీయాలను ప్రచారములోకి తేవలసిన కర్తవ్యం ఆంధ్రులందరిపయినా ఉన్నదని విజ్ఞప్తి.

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

దేవ! విషాదభూమి బహుతీవ్ర విషానల మూలమౌర నా
నా విషయ వ్యథోగ్ర తిమి నక్ర ఝషాకుల మీ భవాబ్ధిలో
నావ యొకండు గన్పడ కనారతముం బడి కొట్టుకొందు దుః
ఖావధి గాన నీ కిదె మదాత్మ సమర్పణ మందుకోఁగదే.

భవభయదాగ్ని కీలలకుఁ బ్రాణము తావులుదప్పె, భీతిచే
భవ దరుణాంఘ్రి పంకజము పాయక దిక్కని పట్టుకొంటి నే
నవిరతమున్, దయారస సుధాబ్ధివి గావున పథ్యమేది యే
దవునను కొందునో యది దయన్ ఘటియింపవె నాకు శ్రీ పతీ!

అరయననేక దేహముల నల్లికవెట్టి మరీచి కావళిన్
దొరయు మహా మరుస్థలిగఁ దోచు ప్రపంచ మెఱింగి ఏడి యో
మురహర! నీ దయామృత సముద్రములోఁ బడి యోలలాడగా
దొరకొని నామనో మృగము దూకుచు నూరక చెంగలించెడిన్.

నీ పదఫుల్లపంకజ వినిర్మల దివ్యమరంద పాన లీ
లా పరతంత్రతన్ బరమలంపటమైన మనోమిళింద మో
శ్రీ పరమేశ! చాపల మశేషమునున్ విడనాడి, నిన్ వినా
యే పరదైవమేని నిరసించి దృణంబని యెంచుఁగాంచితే.

ఏనరు లీ జగత్త్రియము నెల్లవిధమ్ముల నేలఁ గంకణ
మ్మూనిన నిన్ను, నీచరణ యుగ్మముఁ గాదని త్రోసివైచి, యే
కోననొ వేరుదిక్కు గనుగో వెదుకం జనువారొ, వార లీ
శాన! కృతాంత దుర్దమ నిశాంత కవాటము తట్టరే హరీ!

లలిత రమా ముఖాంబుజ విలాస వికాసన పూర్ణ దక్షతన్
బాలిచి జగత్త్రయీ జన విబోధ విధాన నిదాన దీక్షమై
నలమి త్వదీయ దివ్యనయనారుణ రేఖలు జాలువారి తా
మెలమి హరించు టెన్నఁడో కదే మదబోధ విభావరిన్ హరీ!

నిరతి సురాసుర ప్రకర నిస్తుల చిత్త చకోర చుంబిత
మ్మరయ సమస్తసాధు జనతాఖిల తాపచయాప నోద నా
దరమగు నీ ముఖమ్మను సుధానిధిఁ జాల్కొను పండువెన్నెలల్
విరిసి మదీయ మానవ మలీమస దుర్నిశిఁ దోచు టెన్నఁడో.

నిండగు యౌవనమ్మున వినిర్మల పాండుర గండమండలిన్
మండిత చండ దీధితి కనన్మణి కుండల తాండవమ్ములన్
బంధువు సేయు నీ వదన పంకజ మచ్యుత! ముద్దుగుల్కు మా
దండను దోచి కందోవకుఁ దానొక విందగు టెన్నఁడో ప్రభూ!

గంగా తుంగ తరంగ భంగిమను జక్కన్ దూఁగి దేవాసురా
భంగ శ్రీక లలాట లాలితమునై త్వత్పాద పంకేరుహా
సంగమ్మైన పరాగపుంజమది యీశా! యుత్తమాంగాన నే
సింగారించు టదెప్పుడో కద దయాసింధూ! జగద్బాంధవా.

దేవ! మదింద్రియాశ్వములు త్రెంచుకొనెన్ మదమేచి, త్రెంచి పా
శావళి నా వివేకమును నట్టి దరో! యురికెన్ జవమ్మునన్;
దావక పాద మందురనుఁ దారిచి త్వద్గుణబంధనమ్ము నం
దీవ బిగింపు తండ్రి! వహించు నొకించుక సాధుభావమున్.

పతినై సర్వపురాణ వాగ్వ్రతతికిం బట్టంగ రానట్టి స
ద్గతి యా శ్రీ పురుషోత్తమున్ విడిచి నిన్ కల్యాణమూర్తిన్ మహా
సతియా నామది సిగ్గువీడి పరమేశా! యింక నెవ్వారి నం
గతి నాసించును దెల్పవే పరమ మాంగళ్యాకృతీ! శ్రీపతీ!

నీదు కృపాలవం బదియు నేను వరించితి, నంత మీఁద నిం
కేదియు స్వప్న జాగృతుల నెన్నఁడు గోరన లేదు నిక్కు; మీ
నాదు నివేదన మ్మొగ్గి మనమ్మునఁ దాత్త్వికమంచుఁ దట్టెనా
వేద విధేయ! కాదనక వేగమ నన్ను బరిగ్రహింపుమా!

అనదను నన్నరో! విడిచి రందరు చూచితె యిప్పుడో దయా
వనధి! యొకింత నాదు దురవస్థ గనుంగొనరాదె, యింక నై
నను నను జెట్టవట్టి యొకనాడయినన్ మతివేగ లేవ? వే
డిన వినరాదు, రా కటికి డెందము వాఁడ విశ్రుతి వేలరా?

అతి భరమైన యీ జగము నంతయుఁ బూనెదు, జీవకోటి బల్
ధృతి భరియింతు, నీకు బరు వింతకు తోచదలేద, జీవ సం
తతిఁ బరమాణువైన నను దండ్రి! భరింపగ భారమా నె? నా
గతి యెవరింక నాప్త జన కల్పక! నీవ యుపేక్ష సేసినన్.

పరిపూర్ణమ్మగు భక్తియున్ వినయమ్మున్ బాలించి ప్రశ్నించెదన్,
సరిగా నారసి యుత్తరమ్మొసఁగుమా, సత్యమ్మదెట్లున్నదో,
త్వరగా నన్ను సముద్ధరించుటకు నాతంకమ్ము లేమున్న? నా
కరి కన్నన్ గిరికన్న నేను బరువై కాన్పింతునే, మాధవా!

ధనములు వేడ, రాజ్యసుఖ దర్పము లక్కర లేదు విద్య లి
మ్మనను గృపాతరంగిత నిరర్గళ మంగళ భావభంగిమ
మ్మనితర వస్తు సుందర మహాంగరుచిం గనుగొన్నఁ జాలు నీ
వనయము నాదువంకఁ; గమలాక్ష! యిదొక్కటె నిన్ను వేడెదన్!

వీఁడతి నీచుఁడున్ ఖలుఁ డపేతగుణుం డధమాధముండు, నా
వాఁడని యాదరింపఁ దగువాఁడు దయానిధివైన నీకుఁ, దా
నేడ విషమ్ము గ్రక్కు ఫణులేడ యహైనను జందనమ్ము గా
పాడుట లేదె నీడయయి వాని సమంద ముదమ్మునందగన్.

ఆకలి ధాక కోర్వక మహార్తిని సిగ్గనుమాట మాటకున్
లేకయ బాటలందుఁ గణలేశము లబ్బినచోట మెక్కుచున్
దేకువ దప్పితిన్; హరి! త్వదీయుఁడు కింకరుఁ డన్యుఁ జేరి యా
వాకిటఁ గుక్కయటాట యది వాసియె నీ కకలంక! చెప్పుమా!

నరకమునందుఁ గూలుదునొ నాకటఁ బోయెడి దేమి? సిగ్గు లే
కరరె చరించు నిన్నరుని కా తలవంపు లనాథ నాథ! యో
నరహరి నీకో చూచుకొను, నాపయి నీదు కటాక్ష ముంపవా
కరమున నెత్తి చూపెదరు గాదె నినున్ జనమాడి పోయుచున్.

నరకమునందు బాధల ననారత మేను భరింతు నెట్టులో
మురహర! నా స్వకర్మగతి మూలమటం చెటో యోర్మివట్టి; యీ
నరణి నిదొక్కటే హృదయశల్యము నన్గని యెల్లవారు వీఁ
డరరె! యనాథుఁడం చనెదరయ్య ప్రభూ! పలుగాకి లోకముల్.

సశేషం.

# రఘునాథరాయల వాల్మీకి చరిత్ర

శ్రీ బి. యస్. రాఘవ

"సాంద్ర విహార పాతి బహుళ జటా జూటికా
రణ్యాగ్ర ప్రసర ధారాళ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచి ఘటా
గంభీర ఘన ఘుమారంభములకు
..........................
నిర్విఘ్న నిబంధనమై తెనుగు కవిత."

మన తెనుగు కవిత.

బహుళాంధ్ర గీర్వాణ ప్రపంచమును పెంపొందించిన కీర్తి, కవితా కన్యకకు పెళ్లి పందిళ్లు వేయించిన ఘనత కవిరాజ శిఖామణి నన్నెచోడునికి, సాహితీ సమరాంగణ సార్వభౌమ కృష్ణరాయ నృపతికి, సంగీతవిద్యా రసజ్ఞుడు రఘునాథ భూపతికి దక్కినది.

ఉ॥ "శారద పుష్టిమై ప్రతిపదంబున జాతియు
వార్తయున్ జమ
త్కారము సత్త్వగౌరవము గల్గ ననేక కృతుల్
ప్రసన్న గం
భీరగతిన్ రచించి మహిమించిన చో నికెవ్వ రెవర
య్యా! రఘునాథ భూప రసికాగ్రణికిన్ జవి
సోక జెప్పగన్."
(విజయవిలాసము)

అని విజయవిలాస కర్త చేమకూరి వేంకటకవిచే నుతింపబడిన రఘునాథ భూప రసికాగ్రణి విరచిత "వాల్మీకి చరిత్ర" కవితా సుమ సౌరభమును రసహృదయు లాఘ్రాణింతురు గాక!

## తారతమ్య పరిశీలన

"మూరు రాయరగండ" బిరుదాంకితుడైన కృష్ణరాయ నృపతి అనంతరము తంజావూరు సామ్రాజ్య లక్ష్మికే కాక, సాహిత్య రాజ్యలక్ష్మికిని శ్రీనాథుడై విలసిల్లిన నాయక వంశజుడు రఘునాథ భూపాలుడు.

"శరణాగత రక్షామణి బిరుదాంక! భామినీ నవీన మృగాంక!" అని ప్రశంసలందుకున్న ఈ విద్వన్మణి రఘునాథ రామాయణము, నలచరిత్రము (ద్విపద) శృంగార సావిత్రి, పారిజాతాపహరణము, వాల్మీకి చరిత్రము ఆదిగా గల ఆంధ్ర కావ్యములకే కాక, రామాయణ సంగ్రహము, సంగీతసుధ వంటి సంస్కృత కావ్యములకును కృతికర్తయై భాసిల్లెను. చేమకూర వేంకటకవి విజయవిలాసము, కృష్ణాధ్వరి నైషధ పారిజాతములకును కృతిభర్త యాతడే.

భువనవిజయము కృష్ణరాయల సభాభవనమే! రఘునాథ రాయల సభాభవనమే విజయవిలాసము! కృష్ణరాయ, రఘునాథరాయ లిరువురును సుకవులే! కృష్ణరాయలు సంగీతానురక్తుడు. రఘునాథభూపాలుడు "రఘునాథ మేళ" రాగకల్పన మొనర్చిన వాగ్గేయకారుడు. కృష్ణరాయల సచివాగ్రణి తిమ్మరుసు. రఘునాథ రాయలకు గోవింద దీక్షితుడు. ఇరువురకును "వెత్తె పైపట్టంబు మదిర!" రఘునాథరాయ లభినవ కృష్ణరాయలని పేర్కొనవచ్చును. కదనరంగమునను, కవితారంగమునను ఏకవిధ ప్రజ్ఞాపాటవములను గనుపరిచిన ప్రతిభావంతులు!

## వాల్మీకి చరిత్రము: మూలము.

కవితావతార ప్రథమతీర్థమై, పరమపవిత్రమగు రఘునాథుని చరితమును జగదాదిమ కావ్యముగ సంతరించి, సుకీర్తిశాలియైన వాల్మీకి చరిత్రమును రఘునాథ రాయలు సహజపాండితీ గరిమతో దివ్యప్రబంధముగ ప్రపంచిత మొనరించి కరుణాసింధుడైన ఆ శ్రీరామచంద్రునికే అంకిత మొనర్చినాడు.

ధర్మఖండము, వాసిష్ఠ రామాయణము, భక్తివిజయ కావ్యములలోని గాథల నాధారముగా గొనినను తన ఉపజ్ఞచేత దానికి మెఱుగులు దిద్ది, సుందర శిలాఖండముగా తీర్చిదిద్దినశిల్పి యతడు. క్రూరకర్మల పాల్పడిన కిరాతునికి, రామమంత్రోపదేశ భాగ్యమును కల్పించి, మోక్షమార్గమునకు సోపానమును నిర్మించి వాల్మీకిగా నొనరించినాడితడు. వాసిష్ఠ రామాయణము, భక్తవిజయములలోని వాల్మీకి ఉత్తమ ద్విజ కుటుంబీకుడైనటులను, బాల్యమున కిరాతవనితా లోలుడై, సత్సంగత్య ఫలితమున పులకడిగిన ముత్యంబె పరివర్తనచెందిన గాథలవంటి తిమ్మవన్నను జోరనీయక, ధర్మఖండమునందలి కిరాతి జన్మ నాధారముగా గొని, మూడాశ్వాసముల మహాప్రబంధ రచనగా కొనసాగించినాడు.

"శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" అను లోకోక్తి నర్థవంతి మొనరించి, మల్లికార్జునుని మహిమలను ముగ్ధ మనోహరతను చేకూర్చి, రఘునాథుని పరమత సహిష్ణుతను వెలార్చినదాతని శ్రీగిరివర్ణన.

సీ॥ చుక్కల దొరదొరకొంచుక నిక్క శిరమున
బదినారు చుంగులపాగ జుట్టి
తెలుపు వెన్నెలనీను తళుకు చెమ్మాయిపై
దోలువల్కు లీనెడు తోడువు పెట్టి
ముద్దులజింక ముమ్మొనవాలు ముట్టను
వరవితో రెండు హస్తములబట్టి
పెళపెళ నను చెలంగుల రంగుల వరెడు
మూడు వన్నెలపట్టు మొలనుగట్టి
గీ॥ శిల్పులకు ముత్తియపు జాయగిల్లు నెక్కి
చారు తర హార శృంగార హారి యగుచు
ధారుణీశ్వర రాజనందనయుదాను
నమ్మనింద్రుల ప్రోల ప్రత్యక్షమయ్యె."

గ్రీష్మ గమన వేళను సప్తర్షులు వారణాశిని చేరుకొనిరి. ఆ ఘట్టమున పద్యమిది:

క॥ అకాశిశ్వరుతా త్రి
రైన విలోచనమునందు నెనగెడు సెగలే
పెకొనియె నవ లోకం
బాకుల బడదోచె గ్రీష్మనుతి భీష్మంబై.

పాలాక్షుని నేత్రమునుండి వెడలెడు సెగలే గ్రీష్మర్తు రూపమును దాల్చినవేమో! అనునట్లున్నదట ఆ మండు టెండ.

అలంకారికుల అభిమతము ప్రకారము ప్రబంధ మష్టాదశ వర్ణన సంహితమైన రచన. ఋతు వర్ణన అందగ్రగామి. రఘునాథుడును తన కావ్యమున ఋతు వర్ణనల కవకాశమును కల్పించకపోలేదు.

సాహితీ సమరాంగణ సార్వభౌముడయిన కృష్ణ రాయ నృపతి తన "ఆముక్తమాల్యద"లో గ్రీష్మర్తు వర్ణన యందు నిరూపమానమైన కవితా శిల్పమును ప్రదర్శించెనని విజ్ఞుల అభిప్రాయము. కుంపట్లయందు తామరలను మొలిపించి, నీరింకిన నదుల రేవులలో దిగంబరుని (శివుని) చేత గుడ్డలుదికించి, పాతాళాన్నంటుకున్న నూతి నీటి కెంపెట్టి తెప్పించి సాహితీ లోకమునకు గ్రీష్మరు వర్ణన పేరుతో చలివేంద్రము నాతడు నిర్మించెనని విమర్శకుల భావము.

నీరింకిన రేవులలో నిర్గుడ్డ పంక్తి, మీనములను చంచుపుటాలలో చీల్చి చెండాడే బక సమూహము, కవితా ప్రావీణ్య ఫణీశుడైన రాయల క్రాంతదర్శిత్వానికి, స్వభావోక్తిచే భూషితమైన పద్యచిత్రమై గ్రీష్మర్తు వర్ణనకు మకుటాయమానమైనది.

ఇక రఘునాథ రాయని గ్రీష్మరు వర్ణనలు:

## ఫణీంద్రుల అనుతాపము.

చ. ఘనతర కీదకోత్కర ముఖంబుల దద్దరి భోగి
ఫూత్కృతుల్
దనరగనూది రోమపథి కనంబక మూర్ధము
కొంపలం
గనకము సీసదర్పమును కైత వసిద్ధునిసంగ
నెల్లెడం
గనగన మించె నెంతయు నఖండ దవాగ్ని
శిలా ప్రఖండముల్.

గ్రీష్మకాలి చండమార్తాండ కిరణంబు కాటిమాటె పట.

గీ. ఊష్మలతిమించ నెంతయు గ్రీష్మపాలి
చండమార్తాండ కిరణంబు కాటిమాట
నెండమావులు గవలెనుద్దండ గతుల
మృగకులంబులు గని తృష్ణదగులుకొనగ.

రమణీరమణుల అనుతాప, ఉపశమనము లిట వర్ణితములైనవి.

సీ. కమ్మవిదెంపు లేగారంబుగల మోవి
కందదక్కర పాకంబులిచ్చి
చలువ తావులుగల్గు కలికి లేబల్కుల
ప్రేంపు బల్కుల గర మలజోలిపి
జీనిపన్ని గూనించిన యాట్టికుదకుంభ
యుగళంబు వక్కన నొత్తియొత్తి
పాటల సుమ సౌరభంబులు విఱజల్లు
సోగను బయ్యెద కొంగు సురటి విసరి
గీ. రమణులెంతయు దమతమ రమణులకును
తాపములుబాపి రోకకొంత తపనుడపుడు
తనదు పంౘ డెండు మార్తుల వెనసినట్లు
కొండలవియమంగ గండంపు టెండగాసె.

వేసవి రోజులెడల జోలజోల నిప్పుకలు గ్రక్కుచో నక్కిశిఖల తేనంబు వెలవడె యతీంద్రులు భూగుహావిభాగంబు వెదకుచు నదీతీరం చేరుకుంటారు. భిల్లమతల్లుల నాగరికత, ప్రకృతి రామణీయకతను తిలకిస్తారా మునిచంద్రులు.

మ. తమ సానిమ్నగదాటి తజ్జల సముద్యద్వాల
శైవాల జా
తము సారద్యుతి తీర భూరుహవిభాగంబులో
గూడి సం

తమసా నీకములోనె నల్దెసలు నిండెం జూచి
రోహో! మహో
తమ సా నీకము నిండె జెల్లదని చింతిం జాల
బల్కెంపుచున్.
స్రగ్ధర. కనిరా మానీంద్ర చంద్రుల్ ఘుంరపవద
స్ఫూర్జదారాముంచు పంచా
నన కోపాటోప చంచన్నఖర కులిశ భిన్నక్రుట
త్కుంభిగాట్కుం
భిని జేకోన్ముక్తముక్తా ఫల పరివిసరోద్భాసి
భిల్లీ మతల్లీ
ధనురాస్ఫాల స్ఫురన్నిస్స్వన జనితమృగీ
ధావనంబున్ వనంబున్.

ఇద్భుత అంత్యానుప్రాసశబ్దాలంకార సంఘటిత రచన పరిశీలింపదగినది.

వాటి భిల్లకాంతలు పసితము పట్టు పీతాంబరములు ధరించు భాగ్యవతులే; రక్తచందనము, గుగ్గిలంపు బొగలు, తెల పునుగు, తని తిని వారను భవించుచుండిరి. పుట్టతేనియ, పెరతేనె, పుట్టజున్ను తొల్లి తేనియల, పెదురుబొంగు అనాటిభిల్లులకు కోకొల్లలు! ఫలధాన్యములు వారకున్నంత మరి యెవ్వరికిని లేవు.

నానాతీర్థ సందర్శన మొనర్చిన మునులు మార్గము కానక "విపిన భూమిపాపట" వలెనున్న తిప్పత్రోవ వెంట వడలు చమటమున నాసికకు దుర్గంధము, పోకి, స్రేవులు గుండెలు విలవిలక వాంతులు ప్రారంభమైనవి. వారు ప్రవేశించినది బోయపల్లె.

మహాకవికి విర్ణితమైన గుణ విశేషములలో యథా వస్తు వర్ణన లొనర్చుట, భావనామూలక వర్ణనలు కూర్చుట ప్రధానాంశములు. బోయ పల్లెయందలి పులుగులు, ఘోరావంబు లొనర్చు నాగిలములు, పశువులకు నూరబందులు, మురికి గవులు భీభత్సమైనవి ముక్తిలలన గోరు ఆ వేల తాపసులకు!

భీకరుడై మేఘపు పిల్లవలెయున్న కిరాతపుడు శర పంక్తులు ప్రయోగించి, "నిలు నిలువుడు మీ చేతంకల సొమ్ములనిచ్చి కదలుడు. నాతో జలపట్టిన మిము నందరనుతక్క పారన్ వైతున్" అని బెదరించినాడు. శర సంధానము నిష్ప్రయోజనము కాగా, ఋషి పుంగవులు "రాతచేసినకేకిరాతా" అని సంబోధించి వయో బోధకమార్గం కల్పించారు. హృదయ పరివర్తనకు అంకురమై బుద్బుదప్రాయమైన జీవితమునకు విశిష్ట వ్యాఖ్యానమైనదీ సంఘటన.

క|| ప్రాయము జలకల్లోల
ప్రాయము కాయంబు నస్థిరం బిందులకై
రోయక దురితమె తమని
పాయక చేసెదవు నింద పరగ పుళిందా!"

అని హెచ్చరించిరి ఆ ఋషిపుంగవులు.

ఆకాలపు వారెంత కాములో అంత మోహ కాములు; వారు వేదవేదాంత వికాస భాసుర విచిత్ర చరిత్రులు, రాగరహితులు, శమదమాది సంపత్సమేతులు అను అంశము ఆనాటి గ్రంథము లన్నిటను చోటు చేసుకొన్నది.

ఆలుబిడ్డలకై తానీ పాపకార్యమునకు బూను కొంటినని ఆ పుళిందుని సందేహము. మును లా పాప కార్యమునందు పతీసుతులు భాగస్వాములేమా కను గొని రమ్మనగా మారు మధ్యమున చెట్టుకొమ్ములను గమనింపక చింతాభరితుడై గృహాంగణము చేరుకుంటాడా బోయ!

క. విలువమ్ములు పట్టు వైదుదు
నలసతి నొక జంకతో లవంరు కూర్పుం
డిల ప్రాయము దనపాపము
దలపోయుదు నిక్కమున దల్లడపడుచున్.

ఆ వేదనా భరితహృదయుడై జంకతో లూపె నుపదిష్టుడాయెను. భవిష్యత్తున మునికోకిలగా పరివర్తితుడు కాబోవు ఆ కిరాతుడు.

"ఓ! పడతీ! నే నొర్చిన పాపంబుల దలపగ నీవు బనిగలదో!" అను గద్దింపునకు "నాయక! నీవు పాపంబునకు బనిలేదు. నీ ప్రాపున నెంతయు గుడిచి కట్టి పొసగుట కన్నన్" అని ప్రత్యుత్తరమొసగిన దాతని అర్ధాంగి. కొని తెచ్చినను, దోపిడీ యొనర్చి తెచ్చినను, జూదమాడి తెచ్చినను. పాపపుణ్య విచక్షణ లేక పపర్య లొనర్చుటయే తన విధ్యుక్తధర్మమని కను విప్పు కలిగించదా కలికి. అంటిముట్టనిమాది ముల్లువలె నున్న అతని మనస్సుకు ముక్తిమార్గమే శరణ్యమైనది. "మరా, మరా" అను తిరు మంత్రాభ్యాస మొనర్చి కఠోర తపోదీక్ష కుపక్రమించాడా బోయ.

సర్వసంగపరిత్యాగియై సంసారమురోసి, బంధువుల తగులెల్ల కుదలంట తెగగోసి, సకల వ్యాసంగములు మాని మానివర్తనుడు కాగా, వానికలవాగెల్ల చెట్టు పుట్టలను వెదకి, నట్టడవిలో చెట్టుంబలెనున్నవాని కను గొని, శాపవదర్యము బట్టెనో శాపుకేయుని మంద లించి ఆవ్యాసులెల్ల మహావ్యాధులబోలె బాధింప ఆ కిబావాధుడు "కను దెఱచి నవ్వి"

క. "...యేమిరయు
బని లేదని ముందు మీరు పలికితిరిపుడే
పనికిటు వచ్చితిరిందఱు
జనుడెఱుగుడు మీదుమాయ జరుగునె? యింకన్."

అని మందలించి, తన జనకుడు దశరథసుతుడు, తల్లి జనకజ, బంధువులు రామభక్తులని తాను పరిశోధించిన విషయమును వెల్లడించె నా భిల్లుడు! మాయా మోహిత జగమున మానవకల్పిత బంధుమిత్ర కళత్ర

పటహారవవధంగ భాగీరథీధంగ
పంఘు ఘుమంఘుమ స్వనధిరంబు
రథాధికార త్రై రథభుజా స్తంభ గం
భీరథకార్క ధంధ దారుణంబు

సీ. పరవిశేద్వోట హాటకుంబు జాటుసిరుల
కాపురంబగు నాకౌకకాపురంబు
దళిసి మణికర్ణికాది తీర్థములవాడి
యతివు సేవించి యచ్చట నలరుమండు.

గంభీర ముద్రదాల్చిన శ్రీమదాంబికా సందర్శన ఘట్టము గంభీరగతిని నడిచినది.

మ. కవిరంతిన్ శ్రీమదాంబికన్ హరి
మణీ కాదంబ కాదంబినీ
జటశోభా నికురంబ చంబరచరీ
చంచత్కరాం భోజభా
జనవాలన్యజవా నిలాంకుర దలాం
చత్కుంతలాంగాంతలం
ఘనజంఘాల మృగేంద్రవాహన నహి
స్త్రీ సేయ శాతో దరిన్.

త్రిణజ్యోతి, ఓహరి, హాహరి ఆదిగాగల విశిష్ట ప్రయోగము లీకవికి వన్నె చోడ, కృష్ణరాయల కావ్య పరిచయ భాగ్యమున కలిగినట్లు విశదీకరించుచున్నవి.

దక్షిణాంధ్ర సాహిత్యమునకు కంఠాభరణమైన ఈ కావ్యము కవితాప్రౌఢిమయందు. భావనాబలము నందు, కావ్యనిర్మాణ కౌశలమునందును రఘునాథుని బుద్ధికుశలత, ఉపజ్ఞను వెనోళ్ళచాటి, రసస్ఫోరకమై వెలయుచున్నది.

## కవిత్వనిర్వచనము :

ఛందోబద్ధమైన కవిత్వమునకు రసపరిపాటి బంగారునకు తావియని పెలవిచ్చినాడు రఘునాథ భూపాలుడు!

"అతిరయ ప్రాసంబు దప్పని యంతమాత్ర
మునకె తిమ్మను దామెచ్చికొ నెడివాని
చాటిపేరు ర! రసపరిపాటిజేల
మాటలగవిత్వము ఘటియించు మేటికవులు!"

శబ్దశాసనముల బోలిన నిఘంటువులనుదాటి, వ్యాకరణముల బోలిన శృంఖలములను విడచి, ఛందస్సుల సర్పపరిష్వంగం విసర్జించను నే తిరుగ భావకులా వాడు ఉండేరేమో! కవితకు రసపరిపాటి ప్రధానాంగమని సుగ్రాహ్యంగా రసజ్ఞుడైన ఆ కవిచంద్రుడు గ్రహించి, విలక్షణమైన కవితారచనకు సామగ్రిని గ్రంథస్థ మొనరించినాడు.

"పలుకరవలె నవరసములు
కులుకం జద్యములు చెవులకున్ హృద్యముగా
........................
........................
........................
చెప్పవలె కవ్వరంబులు
కుప్పలుగా బోసినట్లు, కుంకుమ పైపై
నుప్పిన క్రియ, విరిపొల్లను
విప్పినగతి, ఘుమ్మనక కవిత్వము సభలన్.

చెవులకు జవులై చల్లగ
గవులను దవులై, సమస్త కార్యకలాపం
ధువులై రసవింగడులై
యవురా! యనగవిత లవని వలరగవలదా !"

పరాగరంజితమైన మాటలతేట, రసవంతమై, అర్థవంతమైన రచన కవితారచన! ఎంతటి విశిష్ట వ్యాఖ్యానమో! ఏనాటిమాటో కాని, ఆ మాట బంగారునీటి లిఖింపదగినది. రసపరిపాటి విగ్రహింప జేరక, ఛందస్సుపై మమకారం పెంచుకొని, తమ మనస్సును దానికై లగ్నమొనర్చుకొని కవితారచన కుపక్రమించినవారికీ వ్యాఖ్యానము కనువిప్పు కాగల దేమో! ఛందస్సు సత్తి లోకమునకు సంబంధించిన సమస్య అని భావించదగ్గుదేమో!

## ఉపసంహారము :

రఘునాథుని కవితాశాఖ నధిష్ఠించి వాల్మీకి కోకిల నాటికిని నేటికిని 'రామ' 'రామ' యని కర్ణార విందముగ కూయుచున్నది.

"పుట్ట తేనియ బోలిన నిట్టలంపుదియదనము కలిగిన తెలుగు భాషయందు బుట్ట బుట్టవు మనుగడను నీరాడకేసరి ప్రాసీ, తిరుగొల్పు పేల్పునకు నీకబ్బపు కన్యనిచ్చి యెల్లకడల పెలపేరలు దలువవారిలో పెల కొనిన పేరు గడించినాడు. మహోదాత్తుడై, శత్రుజేతయై, కృతి ప్రణేతయై, కర్ణాటకతంత్రాతయై గాంధర్వ విద్యాధిష్ఠాతయై, కవిపండిత హృదయ సంహారితయగు నీరఘునాథ భూపాల చరిత్రము బంగారు నీట లిఖింపదగినది. రాజకవీంద్ర కృతమై, కవిరాజ సమ్మానితమగు నీతని కృతులాంధ్ర మహోజనులాదరింతురు గాక!" అను శ్రీ నిడదవోలువారి ఆశాభావపు పలుకులు రఘునాథరాయని రచనా రామణీయక మునకు విశిష్ట మణిహారములు.

# పంపకవి

శ్రీ కె. సుబ్బరామప్ప

తెలుగు కన్నడ సాహిత్యముల బాంధవ్యమును గూర్చి మే నెల భారతిలో ప్రకటింపబడెను. 16 వ శతాబ్దముదనుక తెలుగు కన్నడ సాహిత్యముల పరస్పర సంబంధము నందులో వివరించితిని. ఈ వ్యాసమున కన్నడిగుల ఆదికవియైన పంపకవిని గూర్చి తెలుగువారికి పరిచయము గావింప దలచితిని.

కన్నడ సాహిత్యమున మేటికవులు పంప, రన్న, పొన్న అనువారు. వీరిని రత్నత్రయ మందురు. తెనుగు సాహిత్యమున కవిత్రయమువంటివారు వీరు. కన్నడ సాహిత్యమున 9 వ శతాబ్దమున నృపతుంగుడు "కవిరాజమార్గ"మను గ్రంథమును వ్రాసెను, అది లక్షణ గ్రంథమగుటచే 10 వ శతాబ్దమున కావ్యమువ్రాసిన పంపకవియే కన్నడిగుల ఆదికవియని ప్రసిద్ధికి వచ్చెను.

పంపకవి ఆంధ్రదేశముతో సంబంధము కలవాడు. ఆంధ్రభాషతోను సంప్రదాయములతోను నీతనికి పరిచయము గలదు. శ్రీ నిడదవోలు వేంకటరావుగారు తమ సాహిత్యచరిత్రలో పంపకవి తెనుగునకూడ కవిత్వము వ్రాసినట్లు కొన్ని పద్యముల నుదాహరించియున్నారు. తెలుగువారికి నన్నయ భట్టారకు డెట్లో కన్నడిగులకు పంపకవియు నట్టివాడు.

ఆనాడు మతము నాశ్రయించుకొని సాహిత్య మభివృద్ధి జెందినది. కన్నడ సాహిత్యము జైనయుగ, వీరశైవయుగ, బ్రాహ్మణయుగ అని విభజించి చెప్పబడినది. అనగా సాహిత్యముపై మతముల కెట్టి ప్రభావము గలదో వ్యక్తమగును. పంపకవి సదాచార సంపన్నులైన బ్రాహ్మణ వైదిక కుటుంబమునకు జెందినవాడు. జైన మతావలంబి యయ్యెను. ఆంధ్ర దేశమున నాడు విజృంభించుచున్న వైదికమతము గిట్టక కన్నడ నాడునకు విచ్చేసి యుండవోవు. అటులనే వైదిక కన్నడిగుడైన నారాయణభట్టు కన్నడ దేశమున 10, 11 శతాబ్దాలలో విజృంభించుచున్న జైనమతము పరిపడక కాబోలు ఆంధ్రదేశమునకు వచ్చి రాజరాజ నరేంద్రుని ఆస్థానమును జేరి నన్నయ్యకు భారత రచనలో సహాయపడెను. పంపకవి ముత్తాత తండ్రియైన మాధవ సోమయాజి మంత్రసిద్ధినిపొంది యజ్ఞ యాగాదికముల నాచరించి ప్రసిద్ధికెక్కినవాడు. ఈతనిమహిమ చేతనే పంపనికి గౌరవము. కాని అతని యాగధూమము నుండి జైనమతావలంబియైన తన కీర్తికి నైల్యము గలెనని బహుశః పంపడు వ్యసనపడియుండును. ఈ మాధవ సోమయాజి సంతతిలోని అభిరామదేవుడే పంపని తండ్రి. పంపకవికి అనూచానముగ వచ్చిన బ్రాహ్మణ సాంప్రదాయముతో క్రొత్తగ గైకొన్న జైనధర్మము గూడ కలిసికొని రెండును పాలును నీరువలె కలిసిపోయినవే గాని ఒకదానితో నొకటి ఘర్షించలేదు. మతాంతరుడైనను నీతనియందు మతాంధత మూడలేదు. పంపనియందు రెండు సంస్కృతుల సారమును జేరి కొని పుష్టినొందెను. ఉదారమయ్యెను. దీని ఫలితము అతని కవిత్వమున కానవచ్చును.

పంపని వంశీయులు వేంగిమండలములోని వేంగిపట్టు అను అగ్రహారమున నుండినవారు. వేగినాడు కృష్ణాగోదావరీనదుల మధ్యగల ప్రాంతము. ఇది ఆంధ్రదేశమైనను అక్కడ గూడ కొందరు కన్నడిగులు నివసించుచుండిరని గోచరమగుచున్నది. నృపతుంగుడు తన "కవిరాజమార్గమున" (9 వ, శతాబ్దము) కన్నడదేశ విస్తారమును వివరించుచు "కావేరి ఇంద గోదావరి వరెం" (కావేరినుండి గోదావరి వఱకు అని) చెప్పికొన్నాడు. పంపకవి పెద్దవాడై గొప్పకవి అగు సమయమునకు వేంగిమండలమునకు పశ్చిమమున నుండు కన్నడ నాడునకు సమీపమున గల వేములవాడ యందు రాజ్యము సేయుచున్న అరికేసరి ఆస్థానమును జేరెను. ఈ ప్రభువుయొక్క ఆశ్రయమున కావ్యరచన గావించి పూజాపురస్కార లాభములను పొందెను ("పూజె వెగ్గ ల్లాభంగళు") పిమ్మట నితడు కన్నడదేశమున మలెనాడు ప్రాంతమున సంచరించి అందలి ప్రకృతి రామణీయకమునకు అచ్చెరువంది తన కావ్యమునందు దానిని సొగసుగ వర్ణించెను.

వానిలో బనవాసి యొకటి. దీని నితడు కడు హృదయంగమముగ చిత్రించెను.

అరికేసరి రాజు పంపని తన ఆస్థానకవిగా జేసికొని అతనిచే "విక్రమార్జున విజయ"మను పేర మహాభారతమును వ్రాయించెను. ఒక శతాబ్దము గడచినవెనుక తెలుగుదేశమున వేంగీమండలము నేలిన రాజరాజ నరేంద్రుడు నన్నపార్యునిచే మహాభారతమును తెనుగున వ్రాయించెను. పంపకవి తొలుత "ఆదిపురాణ"మను జైనతీర్థంకరుని చరిత్రను వ్రాసెను. పిమ్మట మహాభారతమును రచియించెను. తనకు ప్రేమదాతయైన అరికేసరిని అర్జునునితో పోల్చి తనివిదీర అతని ధైర్యసాహస పరాక్రమములను వర్ణించియున్నాడు. అందుచేత దీనికి మహాభారతమను పేరిడక "సాహస విక్రమార్జున విజయము"ని నామకరణ మొనర్చెను. ఈ అనుకరణమును మన నన్నయభట్టు కూడ జేసి ధర్మరాజును వర్ణించుచు రాజరాజనరేంద్రుని పొగడియున్నాడు. "రాజకులైక భూషణుడు" అను మొదలయిన నన్నయ పద్యములు చదివినప్పుడు రాజరాజును ధర్మరాజునకు పోల్చిన ఛాయ కనుపించును. గ్రంథమును అంకితము చేయుపద్ధతికూడ పంపని సాంప్రదాయమును నన్నయ్య కూడ అనుకరించెనని చెప్పవచ్చును. పంపకవి గ్రంథాదిలో చాళుక్య వంశమును బ్రహ్మాండముగ వర్ణించియున్నాడు. చాళుక్య నరేంద్రుడైన రాజరాజునకును అప్పటికే ప్రసిద్ధికి వచ్చిన పంపని భారతముపై అభిమానము గల్గియుండును. తన యాస్థానమున నాతని భారతమును నారాయణభట్టుచే చదివించి యుండును. అది నన్నయ్యను భారతమును తెనుగున వ్రాయుమని కోరుటకును అతనిని ప్రోత్సహించినది. అందులకే నారాయణభట్టు సహాయమును అపేక్షించి నన్నయ్య భారత రచనకు పూనుకొన్నాడు. నారాయణభట్టు పంప భారతమును మన నన్నయ్యకు బాగుగ చదివి వివరించినాడు. లేదేని "భారత ఘోర రణంబునందు నారాయణునట్లు తన కిష్టుడును సహాధ్యాయుడును నైనవాడు అభిమతంబుగ తోడై" ఇంతకంటె నేమి సహాయమును చేసియుండనోపును? అందులకే కొంతవరకు నన్నయభట్టు, పంపని అనుసరించినాడు. ఈ అనుకరణలను వేరుగ నివేదింతును.

పంపడు కవిమాత్రమే కాడు. యోధుడు. వీరుడు. భారతకథతో అరికేసరి కథను జోడించి తన పోషకుని కీర్తిని చిరస్థాయిగా నిల్పెను. రాజువెంట రణరంగములకుకూడా పోయి శౌర్యముతో పోరాడినాడు. దీని నుండి ప్రభువునకును ఆశ్రితునకును కావలసినంత ప్రయోజన మొదవెను. రణరంగములను, అందలి వివిధ విన్యాసములను, సైనికుల దినచర్యలను, వారి లోప దోషములను, శౌర్య సాహసములను అతి సహజముగ భారతమున వర్ణించియున్నాడు.

పంపకవి రచియించిన "ఆదిపురాణము" "విక్రమార్జున విజయము"లనుగూర్చి పరిచయము జేసికొందము.

## "ఆదిపురాణము" (క్రీ. శ. 941)

ఆదిపురాణము ఆదిజైనతీర్థంకరుడైన వృషభనాథుని చరిత్రను వర్ణించును. దీనిని వ్రాయునప్పుడు జైనమతాభిమానము ఈ కవియందు మెండుగా కానుపించును. ఈ గ్రంథ రచన మూలమున రెండు ధర్మములను సాధింపదలంచెను. "సం. అ-ఆదిపురాణదోళ్-ఒఱువుదు కావ్యధర్మముం, ధర్మముమం" అని గ్రంథాదిని చెప్పుకొన్నాడు. ఈ రెంటి ఘర్షణలో (కావ్యధర్మము-మతధర్మము) కావ్యధర్మోత్పాదనకు మతధర్మము అడ్డువచ్చినదని చెప్పవచ్చును. దీనికి ముఖ్యమైన కారణము జైనపురాణస్వరూపమునందే గలదు. అందులో లోకదేశాది విభాగములు, తపోమహిమ, జన్మాంతర కథలు, తీర్థంకరునికి ఆఖరు జన్మమున జరుగు 'పంచమహాకల్యాణములు' అతడు గావించిన ధర్మోపదేశములు—మొదలైనవి జైనసాంప్రదాయానుసారముగ వర్ణించియే తీరవలెను. కవికల్పనాశక్తి కిచట తావులేదు. ఈ కారణములచే పంపకవికి ఆదిపురాణ రచనయందు చేతులు బిగపట్టినట్టయినది. ఈ పురాణ కథనమందు కొన్ని నీరసములైన ఘట్టములను తొలగించిన యెడల నిదియొక ఉత్తమ కావ్యమగును. దీనియందు జైనధర్మసారమును రమ్యముగ చిత్రించియున్నాడు.

మానవుని సహజప్రవృత్తి భోగములకడకే పోవును. ఇట్టి విషయసుఖములందు వ్యామోహపడి వానిని పొందగోరి సంసారమున తికమకపడి పరితపించును. ఒకవైపు కీర్తిపరవశుడై మోజుపడి వానిని సాధించుటకై ప్రాకులాడును. ఇన్నియు లభించినప్పటికిని కడకు మిగులునది—అతృప్తి. దొరికిన భోగము లేవైనను శాశ్వతముగ నిల్చునా? యౌవనముండగనే కంటె యొను

ము "ఉపమాతీతముని" పొగడెను. ఈతని కృతులు కన్నడ సాహిత్యమున నొక క్రొత్తయుగము నే సృష్టించెను. జైనయుగమనుటకు మారుగ పంపయుగమయ్యెను. చంపూరచనలో వ్రాసినవారందఱికిని, వారు జైనులు కానీ, కాకపోనీ, క్రీ. శ. 1200 వరకు పంపకవి కావ్యములే ఆదర్శములైనవి. ఆదిపురాణమున గద్య పద్యములలో దీర్ఘములైన సంస్కృత సమాసములు మెండు. కొన్ని పద్యములలో పాదాంత్యములందలి కన్నడ క్రియాపదములను తొలగించిన యవి కేవల సంస్కృత రచనలే యనిపించును. ఈతని రచన "లలితపద" భూయిష్ఠమై "ప్రసన్న కవితాగుణము"లతో నొప్పినది. "అక్షర రమ్యత"గలదు. పంపని రచనలోని యీగుణములనే మన నన్నయ్య అనుకరించెను.

భారతము రచించు వేళకు ఈతనిలో సంస్కృతముపై కొంత మోజుతగ్గినది. అచ్చకన్నడ నుడులను అనేకచోట్ల వాడుచువచ్చెను. లోకానుభవము కూడ అప్పటికి అతిశయించినది. వర్ణనావైశద్యము కవి సూక్ష్మదృష్టిని తెలియజేయును. యుద్ధవర్ణనలలో నీతనికీయానుకూల్య ముండెను. అతడు స్వయముగ వీరుడు. రణరంగమున జొరబడి అక్కడి సన్నివేశములను, విన్యాసములను కన్నార గాంచినవాడు. అందువల్లనే యీతని యుద్ధవర్ణనలన్నియు స్వభావోక్తులు. ఇతడు "ప్రసన్నకథా" కథనమందు దక్షుడు. కొంతను — సత్యవతి సందర్శనము, కర్ణజననము, కుంతీ కర్ణ సంభాషణము, శతశృంగ పర్వతమున పాండురాజు కథ మొదలైనవి ఇందుల కుదాహరణములు.

నవీన కల్పన, రసానుగుణమైన కథాశరీర రచన, వస్త్వనురూప రసనిర్మాణము, రసమునకు తగినట్లు ఛందస్సును వాడుట, కావ్యసౌందర్యమును చెడనీయక అంగోపాంగములను వర్ణించుట, పంపని రచనందు కానవచ్చును. అతడు పాత్రలకు జీవమిచ్చి యెదుట నిల్పి మాట్లాడునట్లు చేయును. సహజముగ వర్ణించును. సన్నివేశమునకు తగినట్లు మితిమీరక కథను నడిపించును. బహువిధప్రయోగ చతురతను చూపును. సముచ్చయములను విరివిగా వాడుట ఇతనికి ఇష్టము. "హితమిత మృదువచన," "ప్రసన్న గంభీర రచన చతుర," "కోమలం...సూక్తిగర్భం, మృదుసందర్భం, విచారచతురం, ఉచితపదం, శ్రవ్యం" అని తన కావ్యగుణములను గూర్చి నిరూపించుకొన్నాడు. "లలిత పదం" "ప్రసన్న కవితాగుణం," "అక్షర రమ్యత"—వీనినిగూర్చి కూడ చెప్పికొన్నాడు.

పంపకవి మహాభారతమందలి యొక అపూర్వమైన భీమదుర్యోధనుల గదాయుద్ధ కథనే రన్నకవి "గదాయుద్ధ" అను గొప్ప కావ్యముగా వ్రాసినాడు. పంపని శైలిని మెచ్చికొని యీతని కొన్ని వాక్యములను చిన్నమార్పులచే తన గ్రంథమున చేర్చికొన్నాడు. ఈతని కల్పనా చాతుర్యమున కొక యుదాహరణము.

"ఇదఱొళ్ శ్వేతాత పత్ర స్థగిత దశదిశా
మండలం, రాజచక్రం,
పుదిదత్తా డి త్రిసంగి త్రి దఱొళ్
కురురాజాన్వయం, మత్ప్రతాప
క్కె దళిందం నోడకుర్వ ద్విదుదిదువె
మహాభారత క్కాదియాత్త
బ్బ దశాక్షీ పేఱ సామాన్యమె బగెయె
భవత్కేశ పాశ ప్రపంచం"

ద్రౌపదీ కేశపాశమే ఒక ప్రపంచమైనది. దాని యందు అనేక రాజాధిరాజులు అణగిపోయిరి. కౌరవ వంశమే దానియందు అంత్యమయ్యెను. మహాభారత సంగ్రామమునకు అది నాంది అయ్యెను. కౌరవుల నుండి ద్రౌపదికి గల్గిన అవమానమే మూలకారణము కదా! ఇది పై పద్యము యొక్క భావము.

## నన్నయ అనుకరణ

పంపకవిని నన్నయభట్టు కొన్ని సందర్భములలో అనుకరించి యున్నాడు. తనకు సహాధ్యాయుడును, ఇష్టుడునునైన నారాయణభట్టుచే పంపని రచనా రీతులను, వర్ణనా కౌశల్యమును, 'ప్రసన్న కవితార్థ యుక్తిని', 'అక్షర రమ్యతను' తెలిసికొన్నాడు. అనుకరించదగిన వానిని అందుకొన్నాడు. చాళుక్యులు కన్నడము తెలియనివారు కారు. చాళుక్యులు కన్నడిగులు సంబంధీకులు (చూ. డా. నేలటూరి వెంకటరమణయ్యగారి "వేములవాడ చాళుక్యులు" "భారతి" డిశంబరు 1948) ఒక శతాబ్దమునకు ముందే రచింపబడినట్టి పంపభారతము సంగతి రాజరాజనరేంద్రుని ఆస్థానమున ప్రసిద్ధికి వచ్చియే యుండును. కన్నడ కవి నారాయణభట్టుయొక్క సహాయమునుగూర్చి నన్నయ గ్రంథాదిని గొప్ప ఉపమానము

